# లియొనార్డో డా వించి

ఇబీ లెప్సకీ





లియొనార్డోకి కుతూహలం, ధైర్యం ఎక్కువ. ప్రతి రోజూ ఊరి పరిసర ప్రాంతాలలో తిరిగేవాడు. చూసిన ప్రతిదానికి సంబంధించి ప్రశ్నలు అడిగేవాడు.

ఇంద్రధనస్సులో ఇన్ని అద్భుతమైన రంగులు ఎందుకు ఉన్నాయి?
మడుగులోకి రాయి విసిరితే అది వలయాలలో అలలను ఎందుకు సృష్టిస్తుంది?



వాగులో వేసిన చిన్న కొమ్మలను అది ఎక్కడికి తీసుకుని వెళుతుంది?

ఎప్పుడూ క్షణం తీరిక లేకుండా, అనేక విషయాల పట్ల ఆసక్తితో, అనేక ఆలోచనలతో ఉండే లియొనార్డో అంటే అతడి తండ్రికి ఎంతో గర్వం.



లియొనార్డో ఒక ఊళ్లో ఉండేవాడు. అతని తండ్రి పట్టణంలో పని చేస్తాడు. లియొనార్డోని చూడటానికి అతడు తరచు పల్లెటూరికి వచ్చేవాడు. వచ్చినప్పుడల్లా కొడుకు గురించి, అతడు చేసే పనుల గురించి అంతా తెలుసుకునేవాడు.



ఒకసారి లియోనార్డో నిర్మాణాలు తప్ప ఏమీ చెయ్యలేదని విన్నాడు. రాళ్లు, మట్టితో ఎత్తైన గోపురాలు ఉండే ఒక కోటను అతడు కట్టాడు. చెక్కలతో ఒక చిన్న వంతెన చేశాడు. గాలికి తిరిగే చక్రం ఒకటి చేశాడు, అది భలే తిరుగుతోంది.

లియోనార్డో వాళ్ల నాన్న నోటరీ పని చేస్తారు. వాళ్ల కుటుంబం రెండు వందల ఏళ్ల నుంచి ఇదే వృత్తిలో ఉంది. న్యాయ, చట్టపర కాగితాలతో నోటరీలు వ్యవహరిస్తారు.

గాలి చక్రంతో పరిగెత్తుతున్న లియోనార్డోని చూసి వాళ్ల నాన్న, "లియోనార్డో ఈ విషయాల్లో ఆసక్తి చూపించటం బాగుంది. అతడు తప్పనిసరిగా ఇంజినీరూ, ఆర్కిటెక్టో అవుతాడు. విసుగుపుట్టించే ఈ నోటరీ పని నుంచి తప్పించుకుంటాడు,“ అనుకున్నాడు.





దాంతో నాన్న చాలా సంతోషించాడు. పట్టణం వెళ్లినప్పుడు లియోనార్డో కోసం ఇంజినీరింగ్, ఆర్కిటెక్చర్‌కి సంబంధించిన పుస్తకాలు కొన్నాడు. వాటితో ఊరికి వచ్చినప్పుడు అతని కొడుకు ఈసారి ఎటువంటి నిర్మాణాలు చెయ్యలేదని ప్రజలు చెప్పారు. అతడు కేవలం ప్రకృతిని అధ్యయనం చేశాడు. చిన్న చిన్న చీమలు, ఇతర పురుగులను ఎంతోసేపు పరిశీలించాడు. అతడు గులకరాళ్లను సేకరించాడు. పళ్లు, పూలు, ఆకుల ఆకారాలను గంటల తరబడి చూస్తూ ఉండిపోయాడు.

ఒక పెంకు పురుగుని అలా చూస్తుండుపోయిన కొడుకుని చూసి నాన్న, "నేను పొరపాటు పడ్డానేమో. లియోనార్డో ప్రకృతి శాస్త్రజ్ఞుడు అవుతాడని అనిపిస్తోంది. అతడు ప్రముఖ మొక్కల శాస్త్రజ్ఞుడో, భౌగోళిక శాస్త్రజ్ఞుడో కావచ్చు. ఏదైతేనేం విసుగు పుట్టించే నోటరీ పని అయితే తప్పుతుంది," అనుకున్నాడు.



దాంతో నాన్న ఎంతో సంతోషించాడు. ఈసారి పట్టణం వెళ్లినప్పుడు లియొనార్డో కోసం వృక్ష శాస్త్రం, ప్రకృతి, భౌగోళిక విజ్ఞానాలకు సంబంధించి చాలా పుస్తకాలు కొన్నాడు. అయితే ఈసారి అతను ఊరికి వచ్చినప్పుడు కొడుకు పురుగులు, పూలను అధ్యయనం చెయ్యటం లేదని ప్రజలు చెప్పారు. ఇప్పుడు అతను బొమ్మలు మాత్రమే వేస్తూ ఉన్నాడు. చూసిన ప్రతిదానిని – రైతుల పరికరాలు, నీటి పాత్ర, గొర్రెలు...

...వేప చెట్టు, గడ్డి మోపులు – అతను చిత్రిస్తున్నాడు. పెద్ద పెద్ద జ్యామితి ఆకారాలు, అలంకరణ డిజైన్లు కూడా వేస్తున్నాడు.

"నేను అతడిని తప్పుగా అర్థం చేసుకున్నానేమో," తండ్రి అనుకున్నాడు. నేల మీద గీసిన పెద్ద డబ్బాలలోకి దూకుతున్న కొడుకుని అతడు చూశాడు. "నా కొడుకు ఒక కళాకారుడు అవుతాడేమో. గొప్ప చిత్రకారుడై నా కుటుంబాన్ని విసుగుపుట్టించే ఈ నోటరీ పనినుంచి తప్పిస్తాడు."







లియొనార్డో వాళ్ల నాన్న చాలా సంతోషంగా పట్టణం తిరిగి వెళ్లాడు. అక్కడ అతను పేంట్లు, బ్రష్షులు, కాగితాలు, జ్యామితి, డిజైన్ పుస్తకాలు కొన్నాడు. కానీ అతడు ఊరికి తిరిగి వచ్చేటప్పటికి లియొనార్డో ఇప్పుడు బొమ్మలు వెయ్యటం లేదని ప్రజలు చెప్పారు.

ఇప్పుడు లియొనార్డో ఎగరటంలో ఆసక్తి చూపిస్తున్నాడు. పక్షులు ఎలా ఎగురుతాయి? అవి రెక్కలను ఆడించటం, తోకని కదిలించటం, గాలిలో ముందుకి వెళ్లటం, తిరిగి కిందకి దిగటం వంటి వాటిని చూస్తూ అతడు గంటలు గంటలు గడుపుతున్నాడు.



ఎగరటం పట్ల ఉన్న ఆసక్తి వల్ల లియొనార్డోకి గాలి పట్ల కూడా ఆసక్తి కలిగింది. మబ్బులను గాలి కదిలించటం అతడు చూశాడు, రాలుతున్న ఆకులను అలా గాలిలో తిప్పి నేలకి చేరవేయటం గమనించాడు.

లియొనార్డో ఒక పెద్ద గాలిపటం చేసి దానిని ఆకాశంలో చాలా పైకి ఎగరేశాడు.

అయితే, ఈసారి లియొనార్డో వాళ్ల నాన్న కొంత నిరాశ చెందాడు.

గాలిపటంతో పరుగులు తీస్తున్న లియొనార్డోని చూసి, "నా కొడుకుకి చంచలత్వం ఎక్కువ. అతడు వంద రకాల పనులు మొదలు పెడతాడు. త్వరలోనే వాటిల్లో ఆసక్తి కోల్పోతాడు. చివరికి లియొనార్డో కూడా నోటరీగానే అవుతాడేమో," అనుకున్నాడు.



అతడు ఆ విచారంతోనే పట్టణం తిరిగి వెళ్లాడు. లియొనార్డో గురించి అతడు బాధపడసాగాడు. అతడు ఏమవుతాడో నాన్నకి తెలియటం లేదు.



అయితే ఈసారి అతను ఊరు వెళ్లినప్పుడు ప్రజలు అతని కొడుకు మహలు, వంతెన, గాలికి తిరిగే చక్రం వంటివాటి తోపాటు ఒక గాలిమర తయారు చేశాడనీ, అది బాగా పనిచేస్తోందనీ చెప్పారు.



లియొనార్డో మళ్లీ పురుగులు, పువ్వులు, గులకరాళ్ల తోపాటు ఇప్పుడు నక్కలు, ముళ్ళపందులు, బ్యాడ్జర్ వంటి పెద్ద జంతువుల పట్ల కూడా ఆసక్తి కనబరుస్తున్నాడని అతడికి ప్రజలు చెప్పారు.



లియొనార్డో ఇప్పుడు మళ్లీ బొమ్మలు వేస్తున్నాడని ఊరి ప్రజలు అతడి నాన్నకి చెప్పారు. అయితే ఈసారి వస్తువుల బొమ్మలే కూకుండా మనుషుల సజీవ చిత్రాలు గీస్తున్నాడని చెప్పారు. అతడికి కనపడిన ప్రతి ఒక్కరి బొమ్మ వేస్తున్నాడు. అంతేకాదు, జ్యామితి, అలంకరణల డిజైన్లు కూడా వేస్తున్నాడు.



పక్షులు ఎలా ఎగురుతాయి, గాలి ఎలా పని చేస్తుంది అన్న అంశాల్లో ఇప్పటికీ లియొనార్డోకి ఆసక్తి ఉందని అతని నాన్నకి ప్రజలు చెప్పారు. అంతేకాకుండా ఇప్పుడు అతని గాలిలో స్వయంగా ఎగరాలనుకుంటున్నాడు. రెండు పెద్ద రెక్కలు తొడుగుకుని ఒక కొట్టం మీద నుంచి దూకాడు. అదృష్టవశాత్తు గడ్డి కుప్ప మీద పడటం వల్ల అతడికి పెద్దగా దెబ్బలు తగల లేదు.

అవే కాకుండా లియొనార్డోకి కొత్త ఆసక్తులు కూడా ఏర్పడ్డాయి. గ్రహాలు, నక్షత్రాలను పరిశీలించటానికి అతడు ఇప్పుడు చాలా పొద్దు పోయేవరకు మేలుకుని ఉంటున్నాడు.

తన కొడుకు మనస్సు చంచలమైనది కాదని, అనేక విషయాల పట్ల అతడికి ఆసక్తి ఉందని, అతడికి అసాధారణమైన శక్తి ఉందని లియొనార్డో వాళ్ల నాన్న గ్రహించాడు.



లియొనార్డో పెద్దవాడైన తరవాత వాళ్ల నాన్న చేస్తాడనుకున్నవన్నీ చేశాడు – ఇంజినీరు, ఆర్కిటెక్ట్, మొక్కల శాస్త్రజ్ఞుడు, చిత్రకారుడు, ఆవిష్కరణలు. ఇవే కాకుండా అతడు ఇంకా చాలా చేశాడు – అతని కాలానికి లియొనార్డో డా వించి గొప్ప ఆలోచనాపరుడు, ఆవిష్కర్త.

అయిపోయింది